

శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ ఫిలింస్
సమర్పించు
గిరీ మూవీస్

# మేరీ మాత

ఈస్ట్‌మన్ కలర్

స్క్రీన్‌ప్లే - డాన్సు - నిర్మాత - దర్శకుడు · కె. తంగప్పన్

తారాగణం:

జయలలిత

పద్మిని

కె. ఆర్. విజయ

దేవిక

విద్య

మనోరమ

జి. శకుంతల

* * *

జెమినీ గణేశన్

ముత్తురామన్

సుందరరాజన్

నగేష్

## — కథాసంగ్రహం —

కన్యగా వుంటూ పరిశుద్ధాత్మవలన లోకరక్షకుడైన ఏసుక్రీస్తును కన్న దేవమాత, మేరీమాత....విజయవాడ గుడిలో వెలిసినా, వేలాంకణ్ణీ వూళ్లో వెలిగినా అన్నిటా ప్రపంచమంతటా నిండినది ఆ కరుణామయి "మరియమ్మ". ఆ తల్లిని నమ్ముకున్న కోటానుకోట్ల భక్తులలో నేనొకర్తిని....

నేనొక అనాధురాలను. అమ్మా - నాన్నా సర్వస్వం నాకు ఆ మేరీమాతే. నాపేరు కూడా ఆ తల్లి పేరే.

నేను నర్సుగా పనిచేసే ప్రైవేటు నర్సింగ్ హోమ్‌లో పెద్దడాక్టరుగారు, నన్ను కన్నబిడ్డలా చూచుకునేవారు. రోగులే నాకు ఆత్మబంధువులు.

ఒకరోజు, ఒక పాప మందు త్రాగనని మారాం చేసింది. అప్పుడు నేను "మేరీ మాత" మహాత్యం గురించి ఒక కథ చెప్పేను.

అనగనగా ఒక ఊళ్లో ఒక తల్లి, ఒక కొడుకు పాలమ్ముకుని జీవించడం వాళ్ళవృత్తి. ఆ కుర్రాడు

పాలు తీసుకెళ్తూ, దారిలో అలిసి నిద్రపోతాడు. అతనికి "మేరీమాత" దర్శనమిచ్చి, తన బిడ్డకు, కొద్దిగా పాలిమ్మని, తీసుకుంటుంది. ఆలస్యంగా వచ్చాడనీ, పాలలో కొంచెం తగ్గాయనీ, మునసబుగారు, ఆకుర్రాడి మీద మండిపడతాడు. వెంటనే మునసబుగారింట్లో పాలసముద్రమే వెల్లివిరిసింది. ఆ వింత ఆ గ్రామ మంతా ప్రాకి, "మేరీ మాత" ఆ కుర్రాడికి దర్శన మిచ్చినచోటు పుణ్యస్థలంగా మారింది.

మానవ ప్రయత్నంకంటే దైవబలంమీద నమ్మకం వున్న నామీద, ఎందరో డాక్టర్లు పెద్ద డాక్టరు గారికి ఫిర్యాదు చేశారు. వారు నా భక్తికి మెచ్చుకొని, అమ్మ మహాత్మ్యాన్నుదహరిస్తూ ఒక కథ చెప్పారు.

"మేరీమాత" దర్శనమిచ్చిన వూళ్ళోనే స్వర్ణమ్మని ఒక గొల్లభామ వుండేది. ఆవిడకు ఒక కుంటి కొడుకు. అతని అంగవిహీనతకు అంతా గేలిచేసేవారు. "మేరీ మాత" ఆ పసిబాలుణ్ని కరుణించి, కాళ్ళిచ్చి, అదే వూళ్ళోవున్న ఒక ధనవంతుడివద్దకుపంపి, అక్కడే తన కొరకు గుడి కట్టించమని కోరింది. మరుక్షణంలోనే

దేశ ప్రసిద్ధమైన ఆలయం వెలిసింది ........ అదే వేలాంకణ్ణి చర్చి.

ఆసుపత్రిలో వున్న ఒక డాక్టరు నన్నెలాగైనా పొందాలని, అసభ్యంగా ప్రవర్తించాడు. నే నొప్పుకోలదని, నాకూ పెద్ద డాక్టరుగారికీ అక్రమ సంబంధం అంటకట్టాడు.

అది విని నేను కుమిలి కుమిలి "మేరీ మాత"ను ప్రార్థించాను. నాక్కాబోయే భర్తను, నా కలలో నాకు కనిపించేటట్టు చేసింది అమ్మ. మరునాడు అమ్మగుడిలో అనుకోకుండా నాక్కాబోయే శ్రీవారిని కల్సుకున్నాను.

ఇద్దరు కల్సుకున్నాం. మనసులూ కలుపుకున్నాం. వారి తల్లిగారి ఆశీస్సులుకూడా పొందేం.

పెద్ద డాక్టరుగారి అనుమతికోసం, మేమిద్దరం కలిసి హాస్పిటల్‌కు వెళ్ళాం. అక్కడొక అత్యద్భుతమైన వింత జరిగింది. అంతా ఆశ్చర్యపోయారు కరుణామయి 'మేరీమాత' మహాత్యానికది ప్రత్యక్ష నిదర్శనం—

ఆ వింతేమిటో నేను చెప్పేకంటే వెండి తెరమీద మీరే చూడాలి.

***

# "మేరీ మాత"

## — పాటలు —

పాట నెం. 1 రచన : రాజశ్రీ

పాడినవారు : ఏసుదాసు అండ్ కోరస్

సాగరతీర సమీపాన
తరగని కావ్య సుధామధురం
కాలచరిత్రకు సాంకేతం
కరుణకు చెరగని ప్రతిరూపం.
బి. జి. యం.

అతడు : పచ్చని వృక్షములలరారు
బంగరు పైరులు కనరారు
మాయని సిరులే సమకూరు
వేలాంకణ్ణి అనువూరు ॥తానా॥
బి. జి. యం.

విరితావులను వెదజల్లి
వీచే చల్లని చిరుగాలి
ఆవూదూడల ప్రేమగని
పాడెను మమతల చిహ్నమని ॥తానా॥

బి. జి. యు.

మట్టిని నమ్మిన కర్షకులు
మాణిక్యాలూ పొందారు
కడలిని నమ్మిన జాలరులు
ఘనఫలితాలూ చెందారు.

పాట : 2 రచన : రాజశ్రీ

పాడినవారు : ఏసుదాసు, మదారి అండ్ కోరస్

తానా తానా తందానా, తానా తానా తందానా
తానా తానా తందానా, తానా తానా తందానా.
చల్లనిఓతల్లీ !అమ్మా
దరిశన మిచ్చావే
ప్రేమను దయతలచి బాలునిపై
పాలను వానగ కురిశావే ॥తానా॥

1. నీ కరుణే నవనీతం
మృదుమధురం నీ హృదయం
మాయును యిక పై మా కష్టం
కుంభములై

2. ధగ ధగ కాంతుల సౌభాగ్యం
చిందించే నీ మణిమకుటం
ఇహమూ పరమూ అందించే
సాధవ మీపై వందనమూ!

3. ఏపుగ పెరిగెను పచ్చని చేను
తీరని ముదము పూరెను ఎదలో
వెలుగులు విరిసెను మనసే వేళ
వింతగ సాగెను వేడుక చాలా
కన్నుల పంటగ ఆశలు పొంగి
మమతల పూలు పూచెను నేడె
శీలము దైవము భక్తియె పెరిగె
కలతలు మానె ధర్మము నిలిచె

4\. అల్లరి చాలును అమ్మాయి—నీ
ఆశలు తల్లికి తెలుసునులే
పెరుగు ఫలియించకముందే
మంగళ వాద్యం మ్రోగునులే

ఆమె : టక్కరి మాటలు పూరించే
చక్కదనాల చినవాడ
చెంతకు చేరి మది తెలుపా—నీ
కెందుకు బిడియం జతగాడా

బి. జి. యం.

ఆశలు చిలికేను
నీలో అమృతమొలికేను
కళలే మిరిసేను
మదిలో రాగము విరిసేను

చింతే పోయినది
ఎదలో చీకటి మాసినది.

పాట : 3

రచన : రాజశ్రీ

పాడినవారు : పి. సుశీల

కరుణామయివే మేరిమాతా ?
కన్నులు తెరవాలీ
కన్నులు తెరచి పేదవాని
కాళ్లు ఇవ్వాలీ
కన్నెమాతే దేవసభలో
తలుపు తెరిపించు
కలతమాపి మనసు నిరియ
వెలుగు ప్రసరించు
కోటి జనుల వెతలు తీర్చ
వరలు ఓ తల్లీ !
కన్నబిడ్డను నీకు విడిచి
ఉంటినే తల్లీ !
జగతి సాగెను నీ వలనే
తరులు మొలిచెను నీ వలనే
పూలు పెరిగెను నీ వలనే
కనికరించవె నా తల్లీ ! నా తల్లీ !....

పాట : 4 రచన : రాజశ్రీ

పాడినవారు : టి. యం. సౌందరరాజన్-

మాధురి అండ్ కోరస్

అతని బృందం : బలే కొంటె చిలకమ్మా పట్టుపెటఏసె

పట్టుపెట ఏసి మురిసి కోనేటికి పోయె

చరణం : కోనేటి గట్టుమీద జారి పడిందంట

జారిపడితే దానిమాఁవ

చెయ్యి పట్టెనంటా

అతడు : వచ్చే వచ్చే గుర్రం వచ్చే

వింత పరుగు చూడు

తట్టిన చాలు మింటికి ఎగురు

చోళరాజు గుర్రం

ఆమె : వొదిలేమంటే జోరే గెలుచు

దేవి ఎక్కు గుర్రం

అతడు : పాండ్య రాజునే గెలిచిన గుర్రం

పల్లవ జనులే మెచ్చిన గుర్రం

ఆమె : దేశం మొత్తం ఎక్కెన వెళ్ళు

జయమ్ము నిజమ్ము దీనిని చూడు

అతడు :   చోళరాజు గుర్రం

ఆమె :   అమ్మా దేవి ఎక్కు గుర్రం!

ఆమె బృందం:కడలియే లాలించు వేలాంకణ్ణీ

యము కరుణను తేలించు మరియాతల్లీ!

మదికొలిచినవారి తోడై తివే

పలు బాధలు మరిపించు వెలుగైతివే

అమ్మా – నీకధలు ఎనలేనివే

నిన్ను నిరతం నమ్మిన సిరులిత్తువే నీలి

అతడు :   ఆడాలీ కడలి అలలేగా

అతడు :   ఆడాలీ యిలా సరదాగా.

ఆమె ;   ఆడెదలే సదా నీ జతగా

అతడు :   తంజావూరు సీమలలో

సిరిసంపద వెలిగెనని

ఆడాలి ఇలా సరదాగా

ఆమె :   వేలాంకణ్ణి చెట్టుచేమ

పెరిగి విరగకాసేనని

ఆడెనులే సదా నీ జతగా

అతడు ; పల్లెజనుల శ్రమతీరి
హృదయాలు పొంగెనని
ఆడాలి ఇలా సరదాగా

ఆమె : అంతటను పశువులతో
పాడిపంట నిండెననీ
ఆడెదలే సదా నీ జతగా

అతడు : మబ్బు చూసి పురివిప్పు నెమలి నాట్యం
తాళమేసి పాటపాడు వయ్యారం
జానపదులు చిందులాడు కోలాటం
ఇది పోర్చుగీసు నావికులకు వుల్లాసం

అతడు : ఆడాలీ యిలా సరదాగా

ఆమె : ఆడెదలే సదా నీ జతగా.

పాట : 5 రచన : రాజశ్రీ

పాడినవారు : యస్. పి. బాలసుబ్రమణ్యం
ఆండ్ మాధురి

ఆమె, అతడు: వింత స్వరం పలికించే
వినువీధులలో పయనించే

కోటి వెండిమేఘాలేకొంచెంఆగాలి–నా
హృదయము గెలిచేవారెవరో
నాకు చూపాలి
మది తెలిపే జతను కలవాలి.

ఆమె, అతడు: తామరల ఎద గెలువ
కదలివచ్చు రవిపోలే
మరిపించు నను పిలువ
చేరువైన ప్రాణప్రియా

అతడు : నీ జంట నేనంటూ
తలచివైచె దేవుడు నేడు
నీ కన్నెరూపే నాలో
నింపించి చూడు చెలియా

అతడు : తీయని జగమ్ము లెన్నో
దేవి నవ్వ మదిలో నిలుపు
చల్లని భావాలన్నీ – నీ తలపే
నాకు తెలుపూ !

ఆమె : నా మదిలో భావమంతా
వినిపించెను గగనాన

తల్లి మనసు కరిగి విరిసి
నాకు తోడు అందజేసె

అతడు : మాధురిలో వాలిసోలి
ముచ్చటలో తేలియాడి
చెలివడిలో మనసారా
కులుకు గడియ నే నెప్పుడో

ఆమె : మనసువుంది మాలవుంది
మనకు పెళ్ళి మునుముందుంది.
హృదయములో నింపుకుంది

పాట : 6 రచన : రాజశ్రీ

పాడినవారు : టి. యం. సౌందరరాజన్

దైవ సుతుడే సాగేను
దైవ సుతుడే సాగేను
తండ్రి పనిని సంపూర్తిచేసి
తనదు రాజ్యముకేగేను

పల్లవి : లోకభారం మోయు భుజము
అను : శిలువభారం మోసేను

15

వెలుగు చిందే కన్నులలో
దీక్ష నిలపి సాగేను

పల్లవి అండ్ అను :
కుమిలిపోయే సమయంలో

శాంతమూర్తి అండ్ పల్లవి :
కోపముడిగి సాగెను
ముళ్ళ కిరీటం తలను దాల్చి
శాంతమూర్తిగ సాగేను
ఎత్తిరి యూదులు కొరడాను-ఏసు
ధర్మము చిందెను ఇలలోన
శిలకొట్టిరి చేతులలో-ఏసు
ప్రేమ చిలికెను మనలోన
కళ్ళులేని యూదులారా
తండ్రి మిమ్ము కాచునులే
మనసులేని యూదులారా
తండ్రి మిమ్ము బ్రోచునులే.

... ★ ...

మాటలు, పాటలు : రాజశ్రీ

సంగీతం : దేవరాజన్

కెమెరా : ఆర్. ఎన్. పిళ్లై

డైరెక్టర్ ఆఫ్ ఫొటోగ్రఫీ : జి. కె. రాము

స్క్రీన్‌ప్లే-డ్యాన్స్-నిర్మాత-దర్శకుడు :

కె. తంగప్పన్

డిస్ట్రిబ్యూటర్స్ :

రాయలసీమ : నవభారత్ ఫిలింస్

నైజాం : శ్రీ తారకరామ ఫిలింస్

శ్రీ పద్మనాభ, విజయవాడ-3.



శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ ఫిలింస్ సమర్పించు గిరీ మూవీస్

# మేరీ మాత

ఈస్ట్‌మన్ కలర్

స్క్రీన్‌ప్లే-డ్యాన్సు-నిర్మాత-దర్శకుడు కె. తంగప్పన్